# పరిమళ



# ప్రణీతము

(కవితా సంపుటి)



కంకణము

అక్టోబరు : 1999

ప్రతులు : 100

ప్రచురణ :

కంకణం

మురమండ (పోస్టు)-533 126

కడియం మండలం

తూర్పు గోదావరి జిల్లా

ముద్రణ:

సవితా ప్రింటర్స్

విజయవాడ - 2

# ముందుమాట

1947 లో భారతదేశం మేధావుల దేశాలలో మూడవస్థానంలో యున్నది. అది 1997 లో 120 స్థానానికి దిగజారింది. కాలాహరణ కాకుండా, కారణాన్వేషణ విజ్ఞుల తక్షణ విధి. దూషణభూషణములు, పండితపామరులు, చిన్నా పెద్ద, పొట్టి పొడుగు, మంచి చెడు, బీద ధనిక, శిక్షా ప్రశంసముల తారతమ్య రహిత సమాన సాంఘిక విధాన నినాదం విచక్షణ కోల్పోయింది. పాలకులను ప్రజలను భ్రష్టు పట్టించింది. ధర్మ విద్యా, వైద్య సేవా దృక్పథం లేని స్వార్థ సంఘం గమ్య నిర్దిష్టమయోమయమే గదా!

గమ్య రహిత ప్రజ ఇటు అటు ఎటు అంటు దిగ్భంధావస్థలో నిర్వీర్యస్థితికి చేరింది. చైతన్య విహీనమైన యీ పోకడ ఎంత దూరం? ఎంత కాలం? దృఢ సంకల్ప సిద్ధాంతానికి గట్టి పునాది చైతన్యానికి కావాలి. అది స్వల్ప ఐదు శతాబ్దాల కాలవ్యవధి కారాదు. యుగయుగాల ఆలోచన, ఆచరణ అనుభవాలే వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు. వాటిని విస్మరించి, నవశకస్మరణంలో విలవిల లాడుచున్నారు. తాత అనుభవం కొంత తండ్రికి దక్కింది. తండ్రి అనుభవం తనయునికి దక్కక సమాజంలో అసభ్య, అసంగత ప్రవర్తనతో హింసకు అలజడికి గురిచేస్తున్నాడు. ఎంత క్లిష్ట సమస్యయినా పరిష్కరించిన కృత, త్రేతా, ద్వాపర యుగాల అనుచరణలను గుర్తుంచుకొని సిద్ధాంత స్థిరీకరణ జరిగితే కలియుగ సమస్యా పరిష్కారం పెనుభారం కాదు. కృతయుగంలో మంత్రశక్తి, త్రేతాయుగంలో తంత్రశక్తి, ద్వాపరయుగంలో వ్యూహరచనాశక్తి, కలియుగంలో సంఘటనాశక్తిగా ధర్మం రూపొందింది. కలియుగ ధర్మాన్ని విస్మరించి కష్టనష్టాలకు గురికావలసి వస్తుంది.

తరతరాలుగా వచ్చిన అనుభవయోగ్యమైన సిద్ధాంతాలను మంటకలిపి కుటుంబ, ఆర్థిక, సాంఘిక శక్తిని నిర్వీర్యం చేయుటే కొన్ని అసాంఘిక శక్తుల కుట్ర '' ఎవరు చెప్పినా నమ్మకండి, మేము చెప్పిందే నమ్మండి'' అదే ఆ శక్తుల ఒరవడి. ఆ కుట్రలోని ఒక భాగమే భాష , ఆ భాషకు పున: జీవనం కోసం మూడు తరాల శతాబ్దం దీక్షతో కృషిచేయాలి. బహుభాషా విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పి

ప్రపంచంలో ఏ భాషలో అచ్చుఅయిన, దిన,పక్ష,మాస, విజ్ఞాన పత్రికలు మాతృ భాషలో తర్జుమా చేసి అతి తక్కువ సమయంలో ప్రచురించి ప్రజలకు అందుబాటులో ఉంటె, అతి స్వల్ప కాలంలో మనకు మేధావుల జాబితాలో అగ్రస్థానం లభిస్తుంది.

1. ఇంగ్లండులో I.C.S. ప్రశ్న "What is the work of a Station Master and a School Master" నేతాజీ సుభాష్ చంద్రబోసు సమాధానం, "The Station Master minds the train and the School Master trains the mind" నల్లవానికి ఇవ్వని మొదటి తరగతి ఇచ్చి అండమాను జైలుకి పంపినారు. సుభాష్ చంద్రబోసును మహా మేధావిగా .....వచ్చే శతాబ్ది గుర్తిస్తుందా!
2. "ఆ వచ్చేవాడు సుభాష్ చంద్రబోసు కాడు, జపాన్ వాడు" అని అబద్ధం చెప్పిన కరం చంద్ గాంధీని.... వచ్చే శతాబ్ది క్షమిస్తుందా!
3. 14 సం.లో సుభాష్ చంద్రబోసు దొరికితే బ్రిటిష్ వారికి యుద్ధ ఖైదీగా అప్పజెపుతానని బాండు వ్రాసిన పండిట్ జవహర్‌లాల్ నెహ్రూని... వచ్చే శతాబ్ది క్షమిస్తుందా!
4. ఇతర దేశాలలో కండలు, బుద్ధులు పెంచుకున్న నెహ్రూ ఇందిరా గాంధీలను భారత జాతీయ ప్రధానులుగా ... వచ్చే శతాబ్ది గుర్తిస్తుందా !
5. భారతదేశంలో పుట్టి పెరిగిన మొదటి ప్రధానిగా "జై జవాన్ జై కిసాన్" నినాదాన్నిచ్చిన లాల్‌బహదూర్‌శాస్త్రిని... వచ్చే శతాబ్ది గుర్తిస్తుందా!
6. భారత దేశంలో పుట్టి పెరిగిన బ్రహ్మచారి వాజపాయి "జై జవాన్ జై కిసాన్, జై విజ్ఞాన్" నినాదాన్ని... వచ్చే శతాబ్ది గుర్తుంచుకొంటుందా !
7. ప్రకటనల పరంపర, ప్రభంజనానికి ప్రలోభపడి ప్రవర్తిస్తున్న ఈ ప్రజలను... వచ్చే శతాబ్ది క్షమిస్తుందా ?

ఆర్థిక, సాంఘిక సంక్షేమంలో నాకు చేదోడు వాదోడుగా నిలచి అన్ని విధాల ధైర్యాన్నిచ్చిన శ్రేష్ఠ హితుడు శ్రీ బొబ్బా వీర్రాఘవులు ప్రతి సందర్భంలోను ప్రశంసాపాత్రుడు. ఆయురారోగ్యాలతో పలువురికి సహాయపడాలని కోరుచూ .....

– కంకణము

సర్వత్రా పూజ్యులైన మాతాపితృలకు

ఆధునికము - అక్రమము
సనాతనము - సక్రమము

1

ఆంధ్రుడంటావు
తెలుంగంటావు
లెస్సలెస్సంటావు
తెలుగుభాషంటావు

భాషరాదు
భావంలేదు
పొత్తులేదు
సత్తులేదు

పాలకడవలో
పాషాణంవలె
భ్రమిస్తావందులో
శ్రమిస్తావందులో

సున్నకు సూన్యంమిన్న
శ్రమకు ఫలితంసున్న
ఎరువు సొంతంగా
సొంతం సొల్లుగా

విందుకు ముందుంటావు
విపత్తుకు వెనుకుంటావు
కష్టాన్ని కాదంటావు
నష్టాన్ని నిరసిస్తావు

సొట్ట కాలితో
తొంటి చేతితో
మెల్ల కన్నుతో
వంకర నాల్కతో

ముద్ర వేస్తానంటాడు
వేలి ముద్ర అంటాడు
లంచాలు ఇచ్చానంటాడు
మలేషియా పోవాలంటాడు

డబ్బు ఖర్చుతో
హక్కు గణంతో
పల్లకి యెక్కేడు
మోయమన్నాడు

ఆడంబర వస్త్రాలతో
అహంకార చ్ఛాయలతో
అభినయిస్తాడు
అంధకారంలో

తందాన తానన్నారు
తహ తహ లాడేరు
భజన పరుల రాజు
బాసల చంచలరాజు

పండితులు పవ్వళిస్తే
మూర్ఖులు ముచ్చటించారు
ముచ్చటకే మురిసారు
పామరుల ప్రాంగణంలో

సింహం లేని అడవిలో
మూషిక రాజ్యం

లంచాలు కుంచాలతో
గుమ్మరించాలి క్షణంలో

వెలయాలికైనా నికృష్టులకైనా
అధికారులకైనా అన్యులకైనా

వస్తా వస్తా మంటాడు
ఏమిస్తావంటాడు
కోరుకోమంటాడొకడు
కొలిచి అంటాడు వేరొకడు

లంచాలిస్తానంటాడు
మలేషియా పోవాలంటాడు

మనిషిలో మాలిన్యం
భాషలో కాలుష్యం
కాల్చినా కరిగినా
పోనే పోదు పోదా!

మనిషి మాలిన్యం కావాలా చేయాలా
భాష కాలుష్యం కావాలా చేయాలా!
పరన్యాయంలో
పర భాష్యంలో
పర శబ్దంలో
పర సంస్కృతిలో

ఏలనో నీకీ
దొంగల న్యాయం
నౌకరీ భాష బానిస బ్రతుకు

ధర్మాన్ని మరచిన జనం
న్యాయాన్ని మింగిన సంఘం
భాష నమ్మిన మహా సభలు
మార్పు చైతన్యం రావాలి

తల్లి నమ్మే తనయులకు
చెల్లి నమ్మే అన్నలకు
శిష్ట రక్షణ కోసం
తిక్కన ఖడ్గం కావాలి

వనం నరికారు
మ్రాను నాటలేదు
తండ్రిని చంపేరు
తనయుని తీర్చలేదు

వినేవారు లేరు
అనేవారు లేరు
వ్రాసింది నేను
వలసింది నేను



సంఘంలో మంచి
పెంచాలన్నాను
మంచి ఉంటే
పెంచడానికి?

మంచి నాటాలన్నాను
విత్తు ఎక్కడన్నావు?

చూడు వెతికిచూడు
తరచి తరచి చూడు
నదిలో గగనంలో
భూమిపై పాతాళంలో
కోనలలో కొండలలో
అడవిలో ఎడారిలో
వెతకిచూడు తరచిచూడు

పలికించు తిలకించు
సోమనాధ ఆలయంలో
భగత్‌సింగ్ పట్టుదలలో
ఛత్రపతి శివాజీ ధ్యాసలో
సీతారామరాజు కార్యంలో
పాపారాయుడి ధైర్యంలో
లక్ష్మీభాయి శౌర్యంలో
బోసు శాస్త్ర వాదంలో
శాస్త్రీజీ చితా భస్మంలో

ఇంకను గాన రానిచో
కలుసుకో నన్ను రుద్ర భూమిలో

బేతవోలు రామబ్రహ్మంగార్కి

2

ఆరి యారని అగ్ని రవ్వ
మెరిసి మెరియని మేలిరేఖ
ఉండి యుండని ఉచ్చశ్రేణి
నిండి దరిని నింగి చేర్చ
విన్న జాడ్యంబు విలసిల్ల

నరనరాల నాదాలు
రగిలెనో, ఘోషించెనో
ప్రబలెనో, విలీనంబో

అందు సప్త స్వరములు వినవచ్చె
ఇందు నవరస కావ్య శ్రవణంబు
అటు పంచరంగుల చిత్తరువులు
ఇటు మృదు మంజీర ధ్వనులు

ఎటుపోగల, ఎటురాగల
ఎటు చేయగల, ఎటు విధిపయనం ?

ఆధునికము – అంజికము
సనాతనము – సత్యము

3

యోచించే దొకటి
మాయమౌ వేరొకటి
ఊహించేదొకటి
ప్రత్యక్షమౌ మరొకటి

౬

ఏది కాలం ? ఏది స్థానం ?
ఏది పాపం ? ఏది పుణ్యం ?

లజ్జవీడి, డబ్బుకోసం
మంచి మరచి, మణులు పొందు
హితుని నెట్టి ద్రోహికి పెట్టు
వాసన కాదన, తళ తళ లౌను

గలగలల కోసం, బగబగమను
క్షణిక కరతాళం చేయెత్తు

నిందల నందనాలుగా
చీదరింపు హారతిగా
మేలిమికోసం మిళితచేసె
నికృష్ట జీవిగ బ్రతుకు

కృత్యం రాక్షసం కూడు రక్తం
సరిపెట్టి, బలపడి, మరల మరల
భాండాగారాలు నింపాలి
దుష్టకార్యాలు పెరగాలి

పండినా మండనోడు
ఆరినా ఆరిపోడు
వదలినా వదలిపోడు
ముందెంత దూరం.

వర్తమానం నశిస్తే
భవిష్యత్తు బ్రతుకుతుందా!

ఆధునికము – అగచాట్లు
సనాతనము – సంధానము

4

అవినీతి పూర్ణం
అధర్మం మిన్న
జ్ఞానం పూజ్యం
దాతృత్వం సున్న

మంచి లేదు
మది లేదు
ఆర్జించి
గుదువ బెట్టు

కుదువ బెట్టి
కుళ్ళ బెట్టి
ఘనతకో
గోడుకో

గొప్ప ఎంత?
గోడు ఎంత?
త్రాగిన రక్తం గ్రక్కాలి
స్వేద ఫలితం దక్కాలి

నిజాయితీ పెంచాలి
ధర్మంకాపాడాలి

ఆధునికము – అజ్ఞానము
సనాతనము – సంకీర్ణము

5

గలగల శిఞ్జితం
కళ కళ వాసితం
తళ తళ శోభా
ఘుమ ఘుమ గంధం

ముఖారవిందం బరయ
ముద్దుగుమ్మల ద్వయం
అలర అలంకృతమై
విలసిల్లి వెదజల్ల

అమాయకం అందంగా

అందమే అమాయకంగా

ఆధునికము – అడ్డము
సనాతనము – సంతర్పణము

6
అన్నంవుంటే ఆకుకోసం
ఆకు వుంటే అన్నంకోసం
వెదకి వెదకి అలసిపోయాను
వెల వెల మందీ బ్రతుకు బాట

ఎప్పడు కలిసే నీ రెండూ?
ఆత్మ శాంతి శాంతి కలిగేను?
ఈ ఉదరం కోసం ఎందుకో
ఈ వెతల వ్యత్యాసం వధ ?

ఆధునికము – అభూతము
సనాతనము – సంయోగము

7
గమ్యంబు మరచి కార్యంబు వీడి
నిశితంబు అలవరిచి నిర్వీర్యంబు
నిర్మల నిర్జన నింగి నీడలో
వాయువేగ కవిఘంటంబూగ

సప్త స్వరముల్ అష్టకష్టముల్
దివ్యరసముల్ దశ దిశలచేర
పొంగుపొరలే యావేదనలో
ఉప్పొంగే ఆశానుభూతిలో

౭

చెప్పేది లేదు చేసేది లేదు
పొందేది లేదు పోయేది లేదు
పొందేది పోదు పోయేది రాదు
కాలం ఐక్యం అనంతంలో

ఇచ్ఛ కబళించ తపన తల్లడిల్ల
యుక్తి ఆవళింప శక్తిపుంజుకొన్న
గ్రహంబు సైంధవుడై అడ్డు తగుల
ఎక్కడ ఎప్పుడు కలవాలి ఎందుకని ?

ఆధునికము - అసంభవము
సనాతనము - సంభూతము

8

ఎగి రెగిరి వచ్చావు
ఎందుండి వచ్చావు
దిగమింగింది చాలక
దేశాలు చాలకనా

కళ్ళంలో దిగావు
గింజలు తిన్నావు
కప్ప సారా కోసం
ముప్పతెచ్చుకున్నావు

ఆశచూపారు
రాయి విసిరేరు
కాలు విరిగింది
కప్పలో పడింది

కప్ప జారింది
గళ్ళు భళ్ళు మంది
తునకలై తారలై
నింగిలో మిళితమై
వలను హిరోషిమా
వలదు ప్రమాదం
(బాబ్రా విమానం)

విరిగిన కప్ప
చిరిగిన గుడ్డ
కలిసింది కరిగింది

కుంటుతూ కూరడాకలో
వాటా కోసం దాకుంది

ఆధునికము – అప్రతిష్ఠ
సనాతనము – సంచితము

9
ఒక మిన్న యొకటని
కులుకుచున్నాయి
నింగిని ముట్టి
చూచు ధరణి

మంచి చెడులు
గొప్ప గోడులు
భేదమెరుగని
స్మశాన వాటిక

గిరి గుట్టగా
యేరు బోదెగా
కాలువ కనలేక
చూచు ధరణి

నదులు పొంగి
పంటలు పండ
కడలి నింపె
ఎల్లవేళల

నదులు బాట మళ్ళించి
వృక్షాలు పెకలించి
కట్టారు కళావిహీన
కట్టడ సముదాయం

। ।

ప్రకృతిని కబళించి
దుర్గంధ శ్రేణి సృష్టించి
వక్ర భాష్యంలో
ఏల నీలో ఈ అహం

కార్యం గొప్పా
గొప్ప కార్యమా

మలిన భాష్యం
మనిషి విషం
తునకలై నశించాలి
భువిలో గగనంలో
జలంలో గాలిలో
ఎక్కడి కక్కడే
ప్రేలిపోవాలి
మానవ మనుగడ సర్వం
మానవ కళ్యాణం స్థిరం

ఆధునికము – అప్రయోజనము
సనాతనము – సుప్రయోజనము

10

బుద్బుద ప్రాణం కోసం
కాలే కాయం కోసం
తప్పుల పరిధి లేక
ఒప్పుల చింత లేక

దుష్టుల దరి చేరావు
ఇష్టుల వల్లన్నావు
లాభంలో పడ్డావు
అవినీతికి చిక్కావు

జన్మ మరిచావు
పాపుల మన్నావు
పవిత్రం లేదన్నావు
విహీనులు మోసపోయేరు

12

కర్మలోనే పాప పుణ్యం
మంచి చెడు ఉనికి
అజ్ఞానం, అవిజ్ఞానం
క్షమిస్తే పోతుందా ?

మరల చేస్తూవుంటే
పాపానికి శిక్ష ఏది ?
నష్టానికి పరిహారం ఏది ?

**ఆధునికము - అంతర్ధానము**
**సనాతనము - సదృశ్యము**

## 11

సంపాదన యేమని
సందేహించు వేళ
సరిగమల రవళియందు
కలిమి కుండలనినన్
అర్థ రహితంబనుచు
పెదవి విరచిన తంతు
విముఖ భావ భావంబు
వెలిబుచ్చె ఘనులు

## 12

వలదు వలదు
అటంచు వగువనేల?
కలిమి కలిమి
అటంచు కలలేల?
వలపు వలపు
అటంచు వయ్యారమేల?
కలము కలము
అటంచు కవిత్వమేల?

## 13

చంద్ర దర్శనము తోడ రేకెత్తు
అంబుధిని అలల ఘోష
ఆహ్లాద ప్రకృతిని చూచి
పింఛ మెత్తి నాడు నెమలి

కుసుమము విప్పి గుమగుమలు
వెదజల్లు భావోదయమునన్
హృదయంబుప్పొంగిన వెడలు
అమృత ధారలై కవిత్వంబు

[illegible]

వయ్యారం వొలక
గాజులు గలగలమన
హంస గమనియై వెడలి వచ్చె
ఒక యింతి చెంతకున్

**ఆధునికము – అపసత్యము**
**సనాతనము – సంతోషము**

**14**

చిరునవ్వే నాడు క్షితిపై యెక్కావు
ప్రాకె చిరుప్రాయంలో
నడిచేవు వడివడిగా
నడిచే వయస్సులో
పరుగెట్టావు గెంతుతూ
పరుగెట్టే వయస్సులో
పడిపోయావు వెలికిలా
కాలంతో పందెం వేసి
ఓడలేక నెగ్గలేక
నలిగేవు సతమత మవుతూ

చలిలో సరిగమలుగా
తాపమే శీతలంగా
వానే ఆహ్లాదంగా
వస్తె ఏకాదశిగా
జీర్ణించే యీజగతిలో
బ్రతుకు బాట అంతంలో
మూగవేదన చితిపై

15

అణుకణ మేధస్సులో
పులకించు తనువులో
ఉప్పొంగు హృదయంలో
దాగేవు ఎందుకో

ఎందెందు దాగినా
ఉరుము వోలె దద్దరించు
ఎందెందు దాగినా
మెరుపువోలె కబళించు
దద్దరించి కబళించి
ఐక్యమగు సృష్టిలో

16

శూన్యంలో పూర్ణం
పూర్ణంలో శూన్యం
శూన్యమే పూర్ణం
పూర్ణమే శూన్యం

పుట్టిన నాడొకటె
ఒక్కటె అంతంలో
మధ్యంతంలో
మిడిమిడి జ్ఞానం
తికమకల ప్రయాణం

ఆనందం మొదలెక్కడ?
దుఃఖం ఎక్కడంతం?

తీరని ఆందోళన
తరగని ఆవేశం
అంతమో అనంతమో
శూన్యమో పరిపూర్ణమో

ఆధునికము - అపస్వరము
సనాతనము - సుస్వరము

17

సర్దుకున్నా
సగంరోజులు
తృప్తిపడ్డా
సగంరోజులు
మన్ననలు
కొన్నిరోజులు
గమ్యం
ఎప్పుడో? ఎక్కడో!

ఆధునికము - అప్రియము
సనాతనము - సుప్రియము

18

ఎక్కడెక్కడేగినా ఏముంది?
ఎందు ఎందు చూచినా ఏముంది?

దూర దర్శి దర్పణ విషంలో
వినోద విషాదాల సంధిలో
మందమతియై కండలు శుష్కించె
చింత చికాకై విలవిలలాడె
ఎక్కడెక్కడేగినా ఏముంది?
ఎందు ఎందు చూచినా ఏముంది?

మనోల్లాస వెతలు కక్కలేక
హృదయం బండగా తనువు తరుపై
వెర్రి తలల వెర్రి విజ్ఞానంబు
మర్మంబు దాచి విషంబు నాటె

ఎక్కడెక్కడేగినా ఏముంది?
ఎందు ఎందు చూచినా ఏముంది?

తీరనాశలో బహుభారంతో
సాగేవు లాగేవు చీకటిలో
దిగేవు మునిగేవు దుర్గంధంలో
ఆశనిరాశ మెరుపు జ్వాలలో

ఎక్కడెక్కడేగినా ఏముంది?
ఎందు ఎందు చూచినా ఏముంది?
నిట్టూర్చి ఉదర విషాదమును గ్రక్కుచు
నవ గ్రహా కూడికన్ గూర్చి

సరిగాని అపసవ్య విద్యలో
గురిలేని దుర్భర బ్రతుకులో
సతమత వర్తమానంలో
శూన్య భవితవ్య బ్రతుకులో

ఎక్కడెక్కడేగినా ఏముంది?
ఎందు ఎందు చూచినా ఏముంది?

తీర్చవోయి నేటి వీరులను
దిద్దవోయి రేపటి పౌరులను
ధైర్యసాహసంబు వెంటరాగ
ధర్మంబు జ్యోతియై చెంత నుండ

ఎక్కడెక్కడేగినా ఏముంది?
ఎందు ఎందు చూచినా ఏముంది?

వస్తువు పై యుండు దొంగబుద్ధి
మనసు పై యుండు మంచి బుద్ధి
చోరులుండు చోట చోర బుద్ధి
ధర్మబుద్ధి కాగ మరేమగు?

ఎక్కడేగినా ఏముంది?
ఎందు ఎందు చూచినా ఏముంది?

హంతకులై అంతమొందించ
మనస్సు నిర్మలమ్మై మెలగ గలదా
హంతకులకు హంతకుడ కాగ
ధర్మ బుద్ధి కాగ మరేమగు

ఎక్కడెక్కడేగినా ఏముంది ?
ఎందు ఎందు చూచినా ఏముంది?

ఆధునికవము – అరిష్టవము
సనాతనవము – సన్మానవము

**19**

ధరణి నినుద్భవించె స్వాతీ నక్షత్రంబు
దద్దరిల్లె భూమాత కోలాహలమునకున్

నిట్టూర్చె ఉదర విషాదమును గ్రక్కుచు
నవగ్రహ కూడికన్ గూర్చి విశేషంబుగా

కన్నీరు కాలువలై పారునో
రక్తంబు మడుగులై చనునో
పన్నీరు మకరందమ్మై వెలయునో
లగ్నంబు ధనుర్లగ్నంబగునో

విషాద కారకుండై
ప్రాణ కంటకుండై
సింహద్వారంబు నుండె
రాహు లగ్నంబై

శాంతి శూన్యంబు నీమానసంబు
ముదము కానరాదు వదన మందు
నీలాంజన కాళ్ళ రాసిన
రాణించెద తరుణినై

స్థాన భ్రంశం చతురంబులో
శక్తి విహీనుడనై సమసిన వేళ

శాంతి శూన్యంబాయె వెతల చెంద
తప్పె బుధునితో కూడిన వేళ
జ్ఞానంబు నశించె గతులవీడ
శక్తిని కోల్పోయి రక్తిని విడనాడ
బుద్ధివిహీనుండై విలసించు వేళ
విజ్ఞానంబు గర్షింతువేనీవు

అనుకూలవతి కాదనుచు అర్ధాంగి
సంతాన విహీనకాగ సంతసించు
ఆక్షేపింతువా నాపడతిని
సుఖగౌరవమున పొంద.
చంచల మనస్కుడై
కార్య విముఖుడై
కలవరించ నేల
మార్గంబు లేదు

కన్నవారి కడుపుతీపి మట్టు పెట్టి
పెంచినవారి మమకారం క్రూలదోసి
నీవా నాపై పగ తీర్చువాడవు
కాంతివిహీనంబు నీముఖారవిందంబు

చాలు గుర్తించవచ్చు
నీ క్రోధాకృతిరూపం
అదృష్టనాధుండవు
నీకా విపరీతంబు
దశమ స్థానమందు
కళావిహీనుండ
కళాకారుడుట
ప్రకాశవిహీనుండట

నవగ్రహ కూటమి
నలుదిశలు చెంద
ఎదెంధైన మీరె
ఎందుకీ వింత వ్యధ ?

ఆధునికము - అగాధము
సనాతనము - సమ్మతము

**20**

తండ్రీ! చూడు చిట్టి చెల్లెలు
హద్దు దాటుచుండె
అగ్రజా! చూడు పోవుచుండె
ముద్దుల తమ్ముడు
చిరుప్రాయం చిందుల
చిటుకల చీకట్లలో
వినలేదు చూడు. కానరాదు
కాల దుర్గతి

హృదయంబు దహించె
శిరము భ్రమణంబయ్యె
వణికెడి కాళ్ళలో
బొంగురు కంఠస్వరంలో

చేయి దాటెనా
చెడు దాపరించెనా
విలపించినా
కిసలించేనా !

పరన్యాయంబుతో
స్వధర్మంబును వీడి
వేగుచున్నాడు వాడు
పరసంస్కృతి మోజులో
గత కట్టుబాటు వీడి
దాటిపోవుచున్నదామె

ధర్మంబు లేక
న్యాయంబు లేక
భయంబు లేక
దైవభక్తి లేక
ఇహంబు లేక
పరంబు లేక
సిరిలేక, సరిలేక
మంచిలేక మర్యాదలేక

వేగుచున్నారు వారు
అంధకార నికృష్ట గుహాకు
ఈతి బాధలందు
వలదు విరోధులకై

ఆధునికము - అస్థిరము
సనాతనము - సుస్థిరము

21

ఎన్నెన్ని పూసెను ఈ జగతిలో
ఎన్నెన్ని రాలెను ఈ ప్రకృతిలో
ఎన్ని పిందలయ్యెను ఈ జగతిలో
ఎన్నెన్ని రాలేను ఈ ప్రకృతిలో

ఎన్నెన్ని ఫలించెను ఈ జగతిలో
ఎన్నెన్ని రాలెను ఈ ప్రకృతిలో

నాలాగ పుట్టారెందరో ఈ జగతిలో
నాలాగ బ్రతకారెందరో ఈ ప్రకృతిలో
నాలాగ ఎందరెందరో బ్రతికారు ఈ జగతిలో
నాలాగ ఎందరెందరో నశించాలి ఈ ప్రకృతిలో

జనన మరణం లేకుంటే
ఏదీ జగతి? ఏదీ ప్రకృతి?

22

దినవృత్తి
మానవ ప్రవృత్తి
పక్షచరుడంబోలె

మామ వెనుక చూపుతో
అల్లుని ముందుచూపుతో
ఎడ్లు బండిలాగె

ముందులేక
వెనుక లేక
శకటం బెక్కిన
కాల పంచకం

రసాయనాలంటాడు ( ఒకడు) మామ
డోలకలంటాడు (వేరొకడు) అల్లుడు

డొక్కల స్థితి యాలశ్యం
బహుకాలం
రసాయినాలప్రబలం తక్షణం
స్వల్పకాలం

ఆలస్యాన్ని నిర్జించి
ప్రబలి సంకుచిత
డొక్కలం కాదంటాడు
రసాయనంకావాలంటాడు.

దిగుబడి యధికం
సత్వరమంటాడు
సులువు సులువంటాడు
సస్యశ్యామలం నిర్వీర్యం
పొల్లు సొల్లుల ఆర్భాటం

కష్టాన్ని రూకలుగా
వ్యర్థం చేస్తాడు
ఫలితం ఫలితం అంటూ
తటపటాయిస్తాడు

రేపు లేదంటాడు
నేడేయంటాడు
గతం లేకుంటే
నేడు నీవెక్కడ ?

22

ఏవీ వృక్షసంపద?
ఏవీ కట్టడ సమూహాములు?
ఏవీ నదుల గలగలలు?
ఏదీ సౌందర్య కలాపం?

వెయ్యాలి డొక్కలు మొక్కలకు
అవి చీకి చీకి పెంటవ్వాలి
రూపం మారి మరియొక రూపం యివ్వాలి
తనువు తరిగించి
ముందు తరానికి
ఫలం అందివ్వాలి

---

ఆధునికవము - అఘవము
సనాతనవము - సన్నాహావము

---

23

కష్టాలు
కన్నతల్లిచ్చె
కడతేర్చె
తల్లివి నీవె
వెనుకాడక
వేగిరమ్ము
భరించ నీ
అశాంత హృదయం

ఓర్వలే నీ భాధలు
హృదయం దుడుకుతో
కార్చు కన్నీళ్ళు రాక
ఏలనీ దాస్య బ్రతుకు

ధ్యానం జ్ఞానం లేక
కారుణ్యం కాన్పించక
సతమత నీడలో
రమ్ము వేగిరమ్ము

రంగు రంగు పువ్వుల
ఘుమఘుమ ప్రదేశంలో
విజ్ఞాన గగన వీధిలో
పద్యాల సంపుటి

23

గలగల సంగీతం
చిరునవ్వుల పసిపాప
తేనెటీగ ఝుంకారం
తణుకు బెణుకు బొమ్మలు

అన్నీ ఏకమ్మై
సంఘటిత శక్తియ్యై
ధరణి రాజుసై
ఏలమనకుండా

చావు కష్టాల ముగింపు
పుట్టుక చావుల కోసం

ఆధునికము – అపహాసము
సనాతనము – సమగ్రము

24

కమలాకరుని కిరణాలతో కమలంబు
నాగస్వరం నినాదంలో నాగేంద్రుడు
నింగిని నీలమేఘాలలో నెమలి
మంచు బిందు మనిగిన మనస్సుపై

కోటియానంద కిరణాలు
గుండెలో గ్రుచ్చుకొనగ
ఆనంద అశ్రువులెల్లసిల్లు
అలవరక లేక వెల్లువలై

దరిలేని ఉల్లాసంలో
సరిలేని సంతోషంలో
మాటరాని తన్మయంలో
మెయి మరచిన తనువులో

గడచిన మధు క్షణంబు
గణనీయంబుగా భువిన్

ఆధునికవము - అంగార కటకి దుఃఖవము
సనాతనవము - సత్పదవము

## 25

పలికించి తివి యప స్వరంబు నోట
విలపించితి మదిలో నిను గూర్చి
కలవరించెడి కలలు కల్లలైనా
పలవరించెడి మనసు శోకించెనా

అపస్వరంబు యసత్యము గావించి
అపకారంబు చేయ మదినెంచక
అపరస్థితి ప్రభావంబు పల్కించె
ఉపకార ఘడియ కొరకు వేచియుండు

విత్తలోభంలో వివేకంబు నశింప
శక్తి సంశయం రేకెత్తరణి మదిని
తృప్తి వివేకంబు నీవెగాక
సప్త స్వర విలాపం చింతించన్

మెలగితివి నీవు అణువణువున
జ్వాలయై దివ్య ప్రకాశంబుగా
కాల మార్పు జీవన మృతుండ
తల్లీ! మృతజీవుడుగా దీవించు

ఆధునికవము - అనావృష్టి
సనాతనవము - సఫలవము

## 26

కావాలి కావాలంటె
వలదు వలదంటావా!
వలదు వలదంటే
కావాలి కావాలంటావా!
కావాలంటే
కాలంలో కలవాలా!

వలదంటె
  వలయంలో వెరవాలా!
నిలవాలంటే
  కలుపుకోవాలా!
కలవాలంటే
  నిలుపుకోవాలా!
నిన్నటి గ్రహణం
  నేడు తప్పదా!
నేడు తప్పినా
  రేపు తప్పేనా!
రేపు తప్పినా
  బ్రతుకు భారమై
అనిశ్చల పథంలో
  అంతమయ్యేవు

| |
|---|
| ఆధునికవము – అడియాస |
| సనాతనవము – సంచయము |

## 27

కడుపు నిండని కరువులో
ఉదరం నింపే ఉల్లాసంతో
నీడలేని తరుణంలో
నిలువ నిచ్చే యింటిలో

కట్టు వస్త్రంబు గాననాడు
కూర్చితివి కూరిమితో
కరమున కంకణముగా
కంఠమున హారముగా ఆనాడు

ఈనాడు
కరమున బేడీలుగా
కంఠమున ఫణిగా
మిగిలేవు కాలానుగతిన
మొండి మూర్ఖుల చేతిలో

ఆధునికము – అఘోరము
సనాతనము – సంకేతము

28

హెచ్చించినా
తీసివేసినా
కలసిన శక్తి
వీడని విధి

వీడిన విధి తృప్తి
కూడిన శక్తి శోభ
మానవత సమ్మతం
దైవ ధీరత్వం

తెలియని తడబాటు
కాలభ్రమణం కానక
అలసట ఆందోళన
వీడని నీడలా !

ధర్మాన్ని విస్మరించక
''చేయు'' ''సాహసించు''
''తెగించు'' ''మరణించు''
(జన్మ) కారణమునకై

ఆధునికము – అనూదితము
సనాతనము – సంపుటము

29

ఓ కవి పుంగవా!
కవిత్వం వ్రాశావా!
కవిత్వం చెప్పావా!

ఆకలిపై
విషాదం పై
గుడిసె పై
మెతుకు పై
చింపి గుడ్డ పై
చెత్త గుట్ట పై

చదివేది ఎవరు?
వ్రాసేది ఎవరు ?

ఐశ్వర్యంలో
అలవాటు లేదు
దరిద్రంలో
తావు లేదు

బీదలని
ధనికులన్నారు
ధనికులని
బీదలన్నారు

ఒకరికోసం
మరియొకని
సృజించి
సృష్టించారు

రష్యాకు ఆహారం
అమెరికాకు వస్త్రం
జర్మనీకి విజ్ఞానం
ఎగుమతి  చేస్తున్నాం

బీదతనం ఎక్కడ ?
బీదరికం ఎక్కడ ?
పేదరికం ఎక్కడ ?
దురాశావాదనలో
పనిలేదు నీతో
చదివే వాళ్ళు లేరు
చదవాలన్న వాళ్ళు
అక్షరజ్ఞానం లేనివాళ్ళు

ఓ సుకవీ
కవిత్వం వ్రాశావా ?
కవిత్వం చెప్పేవా ?

ఆధునికము - అనిత్యము
సనాతనము - సంయత్తము

30

కలిమి
కలలో
కన్నాను

విజ్ఞాన
వీధుల్లో
విహరిస్తు
గగన
గమ్య
గోచరించ

పడలేదు
పగటికల
పండగలు

ఎటు
ఏగినా
ఎగిరేను

వాణి
వాగ్మూలం
వరంగా

ఆధునికము - అనుమానము
సనాతనము - సంబరము

31

వేగిచుంటివి నింగిలోకి
వేగిరవేగి విశదపరచు
ఇలపై జరిగె అక్రమాలు
స్వార్థ పరుల దుష్టశక్తులు
కసాయి వాళ్ళ ఊచకోతలు
అమాయకుల ఆక్రందనలు

'' ఉండు కలసి లేక నశించు''
విశదపరచు పృథ్వీచరులకు
సత్యస్వరూపం మనోభిరామం
చాటిచెప్ప జనులకు

ఆధునికము - అమంగళము
సనాతనము - సంపుల్లము

32

కారిన అశ్రువులారలేదు
కారే అశ్రువుకు తావేలేదు
సున్నిత హృదయం కరిగింది
సుకుమార తనువు తరిగింది

కావ్యాలు వ్రాయలేక
కాలాన్ని విస్మరించలేక
అయినవాళ్ళాకాశంలో
కోరేవాళ్ళ గర్భంలో

భూమిపై లేరు భూసురులిక
మనుగడయే మాయంకాగా

ఆధునికము - అసహ్యము
సనాతనము - సంయుక్తము

33

బండివాని బడాయి
దర్పాల దర్పణం
మెరక పల్లాలలో
సుఖసంతోషంలో
అగ్గిలోని ఖనిజం
నిగ్గు యీ లోకంలో

కష్టాలు ముందు
సుఖాలు వెనక
సాగేను ఎందుకు ?
సరి ఎప్పుడో ?

గోచరించదు ముందు
మరచేను గతాన్ని
పుట్టింది ఎందుకో
గడిచేది ఎక్కడో

పుడమిలో గుప్తకోసం
అకృత్యాలేల ?
అహంకారాలేల ?
తృష్ణతో తృప్తినొందు

34

ఆధునికవము – అకవము
సనాతనవము – సధర్మవము

తనయు త్రోసి రాజని
తమ్ముడే సర్వంబని
యోచించి కర్మలేక
ఏ గంగా జలంబులో

సుతుని విస్మరించి
సోదరుడే సహాయుడని
స్మరించి గమ్య రహితయ్యై
యేగిరిలో గిట్టితివో

కుమారుని నిర్లక్ష్యంబు
అనుజుడనుకూలుడని
సంపూర్ణ విశ్వాసంబు
సడలయగ్నయాహుతౌ

నరక ప్రాప్త సముచితమే
ఘోర మరణ శాసనంబు
అధర్మా న్యాయులకు
ఋజువౌ యీ జగతిలో

ప్రమాణ స్థితి గతినెట్టి
ప్రళయంబు ప్రజ్వరిల్ల

| ఆధునికము – అదంత్రము |
| --- |
| సనాతనము – సన్నిహితము |

35

నందనముగ
పోదార్చనెంచి
తొందరగా
యేతెంచె
మందహాసముతో
చెంతచేరె

కావు సిరిసంపదలు
శాశ్వతంబు
బాపురుమనవలయు
గతించినచో
రావు నీ తోడ
భౌతిక సిరులు
తావులేదు
ఆత్మయందనచు
ఓ దారి
వేగిరమే
వెడలెన్

| ఆధునికము – అమానుష్యము |
| --- |
| సనాతనము – సమాగతము |

36

పసిడిపళ్ళ ముత్యాల ఆరగించక
ఓ బాలామణి
మనోల్లాస వాయువుని పీల్చలేక
ఓ లలితాంగి
సొదాల సౌందర్యము తిలకించక
ఓ అబలా
అద్దాల వెనుక తొంగి నింగిని యేల ?
ఓ వనిత

వీక్షించ విహారముల నిట్టూర్పులేల?
ధర్మంబు వీడక న్యాయంబు వదలక
వేగంబు దిగు అందాల మేడనుండి

ప్రకృతి వడిలో యేరులగలగల
ఉరుముల మెరుపుల ధ్వనికాంతులలో
కోయిల కూతలో, ఆకుల ధ్వనిలో
మేను గగుర్పాటులో చల్లని గాలిలో
రావోయి దిగి రావోయి
మేడనుండి అందాల మేడనుండి

ఆదరముతో ఆదరించే ప్రకృతి
మారు దినదినంబు దివాకరునింబోలె
మారిన రాదోయి నేటి క్షణంబు
నేటి బింబంబు రేపు ఫలించు
నేటి సౌందర్యంబు రేపు నీయజ్ఞాల

ఆధునికము – అపశకునము
సనాతనము – సమంజసము

37

రెమ్మల హారం మెరుపు
బిందువు తిలకం ఎరుపు
ఎర్రబుగ్గల తళుకు
ఉద్రేక ఉన్మాదాల బెళుకు

ఆశ నిరాశయై
దిక్కు కానని బ్రతుకు
ధనం వనం లేక
శక్తి యుక్తి లేక

పత్రం రాల్చిన తరువు
సరస్సున కురిసిన మంచు
చంద్రుని కప్పిన మేఘం
ఆవరించిన శని
నేడో రేపో వీడిపోవా!

రవి కాంచని వేళ
కవి గాంచి స్మరించు
భవిత సృష్టికి

క్రోధ లోభ మోహ ఈర్ష్యలు త్యజించి
వేదనలో చెడు మంచి తరచితరచి
రోదన తరిమి తరిమి సెట్టు నెంచి
రధ మెక్కించి మంచి నూరేగించనెంచు

ఆ కారణంతో
వానా వరదలో
చెట్టుపుట్టలో
గాలి వానలో
అన్యాయం నిర్జించి
ధర్మాన్ని నిలప
తనను కరిగిస్తాడు
తనువు చాలిస్తాడు కవి

**38**

**ఆధునికము – ఆశాహతము**
**సనాతనము – సంధిగతము**

పాషాణ హృదయంతో
తేనెపల్కులు పల్కుచు
చుట్టిముట్టి పొగడ
వెనువెనుక ఎగతాళి

ఆశలో తృప్తా !
కాని వాగ్దానాలా !
వినయ నమ్రతలకు
నిందల హారమా

ఎగిరివచ్చి ఎగిరిపో
ఏల వింత గోల

ఆధునికము - అపహాసివము
సనాతనము - సమర్థము

39

రవికిరణాల హేమంబు చరణాల
మంచు మరుగులు భానుతేజస్సు
క్రోధ తాప తేజోమయం
మంచుకొండ మానస సరోవరం

గ్రీష్మ ఋతువు భీషణ బాహుటం
సేదతీర్చు జిహ్వకు హేమంతం

ధర్మదాత చలివేంద్రం
విశ్రాంతి వటవృక్షంలేక
ఏగుచుండె శేతశాంతికై

వేడివేడిగా చల్ల చల్లగా
తాపతన్మయంతో చను
హాయి హాయి మదిని పోషిస్తూ
రూకలు ఖాళీ య్యై అలమటిస్తూ

ఆధునికము - అపహాసితము
సనాతనము - సహజము

40

దుష్టుడు కూలు కుప్పగా
నేడు కాక రేపు
దుర్జనుడు ఆహుతౌ
నేడు కాక రేపు
దురహంకార దుస్థితి
నేడు కాక రేపు
దుర్మార్గుడు పతనమౌ
నేడు కాక రేపు

సజ్జన సౌమ్యం
నేడు కాక రేపు
జ్ఞాన గుణంబు వెల్లువౌ
నేడు కాక రేపు
పండిత మైత్రి సాగు
నేడు కాక రేపు
ధర్మంబుల వర్ధిల్లు
నేడు కాక రేపు

ఆధునికము – అవకాశము
సనాతనము – సంబోధనము

41

మరల మరల వింటున్నా
విని విని విసుగెత్తి
ఎన్నో ఆశలు రేకెత్తె
విసుగెత్తి వదిలేను

చీకటి వెలుతురులో
ఆశ నిరాశ తంతు

మరల మరల వింటున్నా
హేయ భావం జీవిత చక్రం
పగలు రాత్రి, రాత్రి పగలు
పూటలు రోజులుగా రోజులు ఏళ్ళుగా

తిరిగేను గబ గబ
మండేను బగ బగ
అవసరం మించలేదు
రాణి కావాలనలేదు.

నిమిత్తం క్షణికం విధిచక్రం
విలాసాల విందులో
ముందు వెనుక విహరిస్తుంటే
నీమాట నాకేలనో
నీ పాట నాకెందుకో

ఆధునికము - అవమానము
సనాతనము - సంభారము

42

అంతులేని ఆశలో
తపన పడిన శాస్త్ర విదుడు
తృప్తిలేక తృష్ణ పెంచి
ఆశ రేకెత్తి ఆవేశంలో
కీర్తి మోహం మిన్నుముట్టి
ఒకటి కోసం వేరొకటి
సింహగర్జనం పిల్లికూతగా
శాఖాహార కరిని మాంసాహారిగా
చల్లని కిరణాలలో అగ్నిమంట
ఘన విజయం సాధించె
పిల్లికూత సింహంబు
ఆగ్రహించిన అగ్నికిరణాలలో
అశాస్త్ర విధుడు నశించె

ఆధునికము - అపకారము
సనాతనము - సంభవము

43

మదుగులేదు
అధికుల
అంధకారం

విడలేదు
చిన్నవారి
చిందులు

మధ్యముల్
మర్మమెరిగి
మెలగాలీనాడు

అర్ధంబు చాలక
తెగింపు లేక
చాలని జీవనం

ఇంకెంత కాలం
ఈ అదురు బెదురు
అధికార అబద్ధాలు
నాయకుల సొల్లు
ధనికుల దోపిడీలో
లేని చపలత్వంలో

ఇంక ఎంత కాలం
ఈ అదురు బెదురు బ్రతుకు ?

ఆధునికము - అన్యాయము
సనాతనము - సంప్రదాయము

44

దృక్పథం
దృఢమైతే
నెగ్గినా
ఓడినా
సాగు ముందుకు
శక్తి యుక్తితో

ఫలితాలు
పామరులకు
సజ్జనులు
నిర్జించు

కర్తవ్యం
కార్యంగా
విధి సాధించు
తరాలకు
నిరాఘాట
పూలబాట

ఆధునికము - అంతరాయము
సనాతనము - సంస్కారము

45

వలదు వలదు ముందుచూపు
అలసి అలసి మారె రూపు
వెతలు వెతలు తూర్పు వారె
విసిగి విసిగి బుద్ధి మారె
మార్చలేను బ్రతుకు పాట
బ్రతకలేను ధరణి బాట

ఆధునికము అవాంతము
సనాతనము - సంబోధనము

46

దినదినం
మారె ప్రకృతి
పరాకు పడక
పరికించు
కోరిక మీరక
ఆశ వదలి
విసురు పడక
వివేకంతో
చిలికింపక
తిలకించు

ఆధునికము - అవివేకము
సనాతనము - సత్కారము

47

చెత్త కుండీలో మత్తు సీసాలు
త్యాగం చేసినా తన్నులు తిన్నా
అన్నీ నీవేనని ఆదరించారు
వంగి వంగి వయ్యారాలు
నిండుగ మోకరించారు
మక్కువతో ఎందెందైన
మనగవచ్చు ఘనంగా

గతాన్ని విస్మరించక
గమ్యాన్ని సుగమం చేసుకో

ఆధునికము - అపఖ్యాతి
సనాతనము - సంభావితము

48

విషవలయంలో
శ్రమించి, భ్రమించి
నిర్భాగ్యులను గురిచేసి
మనుగడ మట్టుపెట్టి
అందులో మరణించావు

ఉన్నదాన్ననుసరించక
ఊహిస్తావు లేని దాన్ని
దూరపుకొండలు నునుపు
గెంతుతూ దూకుతావు

ఫలితాలు సున్న గంతులు మిన్న
భాగ్యవంతుల బానిస
దురుద్దేశ్యాల ప్రాబల్యం
ముసుగులో బుసబుసలు

విషజ్వాల వినోదాలు
ఆధిపత్యం అంకితం
ప్రకృతిని వేధిస్తావు
విషమ స్థితి కల్పిస్తావు

ఆధునికము - అవరోధము
సనాతనము - సంరూఢము

49

వీక్షించితి శోకము
చక్షూ రాజస యుగంబుల్
పరికించితి దీనత్వము
ముఖాభావములో
ఆకర్ణించితి విధుల్
మనో సంకల్పంబు

గ్రహించితి నీ చేష్టలు
యోచించితి నిముషంబు
సంకల్ప బలమున్
యోచించి యోచించి

కార్య సాధింపనేర్చి
ఆత్మ క్షోభం అణచిపెట్టి
వెతలు వదలి ఏతెంచె
ధృఢ చిత్తుండనై

**ఆధునికము – అభాగ్యము**
**సనాతనము – సౌభాగ్యము**

**50**

విశ్వమున్ నిశితంగా నింపి
నాధమున్ కూర్మిని మల్చి
సత్య నిరత పదంబులో
నారాయణ స్వరంలో
సర్వ జ్ఞానంబు పొంది
ప్రతి పుట నింపితివట

నీతో యంతంబనుచు
సరళ కావ్యామృతం
ధరణి నుండి దివికి
గైకొని పోతివట

నీ దరి చేరలేక
నీ సరి గాన లేక
కళంక హృదయం
మోము చాటుచేసె

కష్టనష్టాల నిరసంలో
సులువు సుఖాల వేటలో
తత్తర చిత్తుర భావంబులో
గమ్య రహిత యువకవుల్

రమ్ము రమ్ము వేగిరమ్ము
సనాతన ధర్మంబు
కళా ప్రణీతంబుతో
రమ్ము రమ్ము వేగిరమ్ము

పరభావంబు
పరభూషణంబు
వలదు వలదని
చాటి చెప్ప
రమ్ము రమ్ము
వేగిరమ్ము

ఆధునికము – అసత్యము
సనాతనము–సంయతము

51

ఘడియమానం మంట కలపాలి
ఆ మంటలో ధూళి యవ్వాలి
దిద్దుకోవాలి రూపురేఖలు
ఉరుము మెరుపుల శరవేగంలో
ఉద్భవించు పాత క్రొత్తగా
కఠిన శిక్షణ నియమావళి
మెలగాలి మేలైన జ్ఞానం
అశాంతాశలు అంతం కావాలి
వివేక వినయాలే విద్యగా
సౌఖ్యాలు కలుగు నేడో రేపో

ఆధునికము – అంతిమము
సనాతనము – సకలము

52

లేదు నాకు నీడ
రాదు నాకు తోడు
నీడలేని తోడురాని
ఆరని ఆవేదనలో
కారడవిలో కూనలో

అనిశ్చల జీవితంలో
అస్థిర భావంతో
మోయలేని భారం
ఈ అనంత సాగరతీరం
జీవన బాటెంతదూరం

53

ఆధునికము - అదృశ్యము
సనాతనము - సఖ్యము

తేనెటీగల రాజ్యం కావాలి
క్రమశిక్షణ రాజ్యం కావాలి
తప్పులు తన్నె రాజుండాలి
ఒప్పులు మెచ్చె రాజు ఏలాలి

సౌద్యాలు నశించాలి
శోచనీయం పోవాలి
సోమరుల కాలం చెల్లాలి
సొల్లు ఉపన్యాసం మానాలి

కష్టజీవులు కష్టించాలి
రక్షక భటులు రక్షించాలి
కర్షకులు శ్రమికులవ్వాలి
విద్యాధికులు నేర్పు చూపాలి

క్రమబద్ధంగా నిలవాలి
నిలచిన దేశం వర్ధిల్లాలి

54

ఆధునికము - అపాయము
సనాతనము - నిరపాయము

ఘంటమును చేతికిచ్చి
వాణీ తిలకము దిద్ది
ప్రకృతికి ఉల్లాసంగా
అర్పించె నింతి ఆనాడు

హలమును చేతికిచ్చి
లక్ష్మీ కుంకము నుంచి
క్షేత్రమునకు ప్రేమతోడ
నెట్టె యువతి ఆనాడు

పార్వతి ప్రసాదంబుతో
ఆయుధమున్ చేతికిచ్చె
రణరంగమునకు నంపె
ఒక తరుణి ఆనాడు

త్యాగమందు గుర్తించె
సుఖ సంతోషములు

కలమును బట్టిన
భర్తను  బంధించె
స్వార్థంబుతో
వనిత ఈనాడు

హలమును బట్టిన సఖుని
కాళ్ళు బంధింపనెంచె
విషసర్పాలకు వెరసి
లతాంగి ఈనాడు

యుద్ధమునకేగు యిష్టుని
కరముల కట్టనెంచె
భయాందోళనతో
అబల ఈనాడు

కాలం మార్పున పట్టె
దుర్గతి భారత వనితలకు
భారతావనికి ఈనాడు

55

ఆధునికము - అయోమయము
సనాతనము - సహోదానము

నిబ్బరాన్ని కోల్పోయి
నిలువునా కృంగేవు
కేకలు నింగిలో
గంతులు గాలిలో

ప్రళయమే వచ్చినట్లు
ప్రణయంలో చిచ్చుపెట్టి
మోసం మోసం అంటు
మొత్తుకున్నావు సిరిపై

పోపొమ్మని చీదరించి
పొలికేకలు వేశావు
నిష్క్రమించకపోతే
నిలువ దహనం అన్నావు
ధనం వనం లేక
యుక్తిశక్తి లేక
వాడు గమ్య రహితయ్యై
ఎందు మరణించో

56

అధునాతనము - అనతర్షము
సనాతనము - సన్మానము

పరువంబు మణిగె
వయసు మళ్ళె చెదరి
నింగిని యెగిరె లేఖ
తెగిన గాలిపటమై
మ్రానును వ్రేలాడునో
సెలయేరు సందడిలో
సాగర అలల ఘోషలో
ధరణి గర్భంలో
మిళితమై చనునో

ఆధునికవము - అపసవ్యవము
సనాతనవము - సతవము

57

నవ్వులు పువ్వుల బాలగా
నింగికి కాంతి కిరణంగా
మారుతిపై చిరంజీవిగా
ధరణిలో వర్ధిల్లుగాక

అంకితం

అనుకున్నదా చరించావు
అనుకోనిద నుమానించావు
కానిది త్రొక్కి కాళ్ళు కడిగావు
కాలగర్భంలో కలిసేవు

ఆధునికవము - అవగుణవము
సనాతనవము - సంప్రోషణవము

58

తెగిస్తాడొకడు
సాహసియంటాడు వేరొకడు
చెడు సహసం
చిందర వందర పాలు
పిరికి వాళ్ళ పరుగు
సాహసికి అలుసు
ద్వంద సమ్మేళనం
తప్ప ఒప్పల వాటా
అకృత్యాల బాటలో
కలిసే ప్రయాణం

ఆధునికము - అంధకారము
సనాతనము - సంసర్గము

59

విన్నావాత్మ ఘోష విలపించు వేళ
కన్నావా చక్షురాగధారలైన వేళ
అన్నా పడిపోతిని కూపస్థమందు
అన్ననాడు లేరీ అచల ధరణియందు

ఆధునికము - అసమంజసము
సనాతనము - సజ్జితము

60

ప్రేమ ప్రేమంటావేమి ?
ప్రేమంటే మండే మంటా ?
ప్రేమంటే కాలిన కట్టా
ప్రేమంటే శీతల ధూళా ?
ఇవి యేవి కాదని తెలుసుకో
తెలుసంటే ఏమని ఎరుకో

ప్రకృతంతా ప్రేమ స్వరూపం
ప్రేమలోనే దైవ స్వరూపం
దైవత్వంలో సర్వ స్వరూపం
సర్వ స్వరూపం ప్రేమరూపం

గలగల పారే సెలయేరులో
లేత మామిడి చిగుళ్లలో
విరిసి విరియని మల్లెలో
పసిపిల్ల చిరునవ్వులో

చిలికించి చూడు రూపం
వెదకి చూడు ప్రేమరూపం

61

అధునికము – అప్రమాణము
సనాతనము – సంశ్రయము

దొరకునే క్రోధంలో
అతీతం ద్వేషంలో
లోభంలో శూన్యం
అధర్మంలో అగాధం

ఇంద్రియాన్ని తెరిచి వుంచు
ఆత్మశుద్ధితో పరికించు
జ్ఞానసముద్రం దాటి
అందుగల ప్రేమరూపం

కన్పించు గోమాత క్షీరమందు
త్యాగ ముఖారవిందంబందు
ధర్మమూర్తి పురుష ఉదరమందు
సర్వధర్మములయందు గానవచ్చు

ఇదే ప్రేమతత్త్వం
ఇదే ప్రేమరూపం

62

లేమి పొగరు, ఉన్న వగరు
పొగరులేక వగరురాక
మధ్య సతమత, మధ్య కుతకుత
ఇంకెంతకాలం ఈ బ్రతుకు
ఈ అదురు బెదురు మోత బ్రతుకు

తలదించి మేడలోకి
తల ఎత్తి గుడిసెలోకి
వేగలేక వెడలలేక
వేగిరపాట తోడురాక
ఇంకెంత కాలం ఈ అతుకు
ఈ అదురు బెదురు మోత బ్రతుకు

మధుర వంటకం నోరూరించగా
కొనలేక పొందలేక
వదలలేక పోలేక
ఇంకెంతకాలం ఈ అతుకు
ఈ అదురు బెదురు మోతబ్రతుకు

చిన్న పనికి పెద్దవాడు
పెద్ద పనికి పనికిరాడు
ఎరువు పత్రిక పఠనం
చెరుపు వార్త ప్రబలం - ఇం॥ కా॥

నమలుటకు తక్కువ
మింగుటకు ఎక్కువ
నడకకు ఎక్కువ
పరుగుకు తక్కువ
తాపం తాళలేక
శీతల స్థలంలేక - ఇం॥ కా॥

మందు కొనలేక
మనుగడ సాగలేక
ఎదగలేక, కృంగలేక
వెల్లువలేక చావలేక
పంచెకొక్కిం తక్కువ
గోచీకి కొక్కిం తెక్కువ - ఇం॥ కా॥

మెరిసీ మెరియని దుస్తులు
చాలీ చాలని దుస్తులు
కూర్చొన స్థలం చాలక
నిల్చొన స్థంబన లేక
అతుకు గతుకు ప్రయాణం
చంచల గమ్యయానం - ఇం॥ కా॥

తెలుపుపై నలుపా! నలుపు పై తెలుపా!
విధి వదలలేక, భారం మోయలేక
ఆశ నిరాశలు కష్టసుఖాలు
లాభనష్టాలు బ్రహ్మ లిఖితాలు - ఇం॥ కా॥

63

ప్రథమ శ్రేణి ఉత్తీర్ణం
అవకాశంలేని ఉత్తేజం
పేకమేడ పెనుతుఫాను
ఊహాల విహంగ విహారం
కుప్పకూలి కుహనా దర్పం

ఇంకెంత కాలం ఈ బ్రతుకు
ఈ అదురు బెదురు బ్రతుకు



64

తర్పణ భావంబు వీడి
ప్రపూర్ణ పూర్ణంబుగా
మేదస్సదలు పొలిగెడ
ప్రణయధారల పాలు
ప్రళయాల పారు కాగ
శల్య తనువు భ్రమి మది
క్రమ్మె గాఢాంధరేఖలు
సంపూర్ణంబు సతమతమై
శూన్యంబు వీక్షించి గాంచె



65

కలశమునుండి ధర్మధార
కలవరమునుండి వజ్రఘటము
కలమునుండి పారమృతధార
కలహమునుండి తేరుకండల నిగ్గు

నోట వెలగు సత్యసదన
చేత జరుగు సత్యకీర్తి
డెందమునుండి సత్యతపన
మనుగడ మన్ను సత్య సాధన

సాధనసాగు సాగరాంతము
సారించి నిశిత నింగి వరకు
సారహీన ధాత్రి మిళితంబు
సానుకూలముగాక చాలించు



66

ఊహా తరంగాలై
దీక్ష దైన్యంబులు
అహర్నిశల శ్రమ
ఆవిరై వర్షించుమనె

వర్షించి ఋతువున్
కాలక్రమమున తీర్చి
ఆశా నిరాశలను
మార్చునీ ప్రకృతి



67

చక్షురాజీములుండందుండ్డై
జూనుగు బండి భాదిరతుడై
వాయికట్టి నోట మాటలేక
నీకేల ఈ తపన తహతహలు
డెందంబున్న హస్తంబురాదు
హస్తంబున్న హృదయంలేదు
కకాలు డెంబంబులకలయిక ఎక్కడో
జీవితార్ధార్థం వ్యర్థం గాక

